శ్రీ రామచంద్రాయనమః.

శ్రీ

# గురునాథేశ్వరశతకము



శ్రీయుత శతావధాని

దోమా వెంకటస్వామిగుప్తగారు.

గ్రంథకర్త.

శ్రీరామచంద్రాయ నమః.

శ్రీ గుంటూరుపురియందలి తిలకుపేటలో

[illegible]శైవ శ్రీ చెప్పూటూరి గురునాథముగారిచే

ప్రతిష్ఠింపబడిన శ్రీగురునాథేశ్వర స్వామినిగూర్చిన

శ్రీ

# గురునాథేశ్వరశతకము

శ్రీమదాంధ్రవిద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి,

శతావధాని,

## దోమా వేంకటస్వామిగుప్త గారిచే

రచియింపబడి,

శ్రీగుంటూరుపురవాస్తవ్యులగు

మ॥ రా॥ రా॥ శ్రీ చెప్పూటూరి వేంకటప్పయ్యగారి

ప్రోత్సాహముచే

గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితమై

ప్రకటింపబడినది.

1925.

శ్రీరామచంద్రాయనమః

# విజ్ఞాపనము.

గుంటూరుపురమునందుఁగల సత్ప్రయత్నపరాయణులలో కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ॥ ఉప్పుటూరి గురునాథము గారు విఖ్యాతులు. వీరు వైశ్యులు. వీరు గుంటూరుపురమునందు బ్రాహ్మణవైశ్యులకు అన్నసత్రములును, కన్యకాంబానిత్యనైవేద్యకైంకర్యమును నేర్పాటుచేయించియెన్నియోట్లనో చలిపందిళ్ల నియమించి, మంగళగిరి శ్రీనరసింహదేవాలయమునకు, నెల్లూరు శ్రీరంగనాథదేవాలయమునకు గోపురకలశారోపణసేవలఁ గావించి యంతటఁ దనివిసనక సప్తసంతానంబులనుగొల్పఁ గుతూహలమొంది యందు తాడికొండసమీపమునఁగల రస్తాలకూడలియందు తటాకప్రతిష్ఠజరిపి బ్రాహ్మణవైశ్యోపనయనపోషణాదులను గావించి, ధననిక్షేపము గావించి శివాలయప్రతిష్ఠాపనమునకై ప్రయత్నించుచుండిరి. అట్టితరుణమునందు దైవవిపాకమున వారు కాలధర్మమునొందిరి. అప్పుడు సయితము తాము పూనినసప్తసంతాననిర్మాణావశేషమును బూర్తిగావింపఁ దమయన్నకొమారులగు మ॥ రా॥ శ్రీ ఉప్పుటూరి వెంకటపున్నయ్యగారిని నియోగించిరి. శ్రీపున్నయ్యగారు పినతండ్రిగారియిష్టానుసారముగా దేవాలయనిర్మాణముపూర్తిగావింపఁ బ్రయత్నించి, యందుకుఁ బినతండ్రిగారిడినమొత్తము చాలకపోఁగా లోతక్కువ తామొసంగి గురునాథేశ్వరనామకశివాలయము పూర్తిగావించి కీర్తిపాత్రులయిరి. తద్గురునాథేశ్వరస్వామినిగూర్చి యీశతకము వ్రాయుసందర్భము నాకు ఘటించుట శ్రీపున్నయ్యగారిప్రోద్బలమే. ఇందువలన వారిభాషాభిమానము తేఁటపడుచున్నది. శ్రీపున్నయ్యగారు తమపినతండ్రిగారుపూనినసప్తసంతానములను బూర్తిగావించి, స్వయముగాను వితరణప్రఖ్యాతులై జగదుపకారులై కీర్తిగాంత్రుగాత! అందఱికి భగవంతుఁడానందకరుండగుఁగాత!

ప్రకృతము గుంటూరు,
11—6—25.

దోమా వెంకటస్వామిగుప్త,
కర్నూలు.

శ్రీరామచంద్రాయ నమః

శ్రీగురునాథేశ్వరాయ నమః

# శ్రీగురునాథేశ్వర శతకము.



## ప్రార్థనాదికము.

శ్లో॥ శ్రీమద్భక్తపురస్థపూర్ణజనతానందాతిసంపత్ప్రదం
జ్ఞానాంభోనిధిపానగాశ్రితహృదబ్జాతార్కబింబోదయం
సూర్యాగ్నీందువిలోచనం పశుపతిం కామ్యార్థసంసిద్ధయే
వందేహం శుభదం శివాంచ గురునాథేశం జగద్వల్లభం॥

శ్లో॥ ఉద్యన్మృత్యుకరాళపాశయుతదోరాకృష్యమాణాసుయు
గ్మార్కండేయ ఉదగ్రఘోరవపుషే. సూర్యాత్మజే బాలకే
నాహాహాంతశ్చ సముత్థిత శ్శమనవక్షఃపీఠసంపాటనో
య స్త్వం స్వామి శుభప్రదంచ గురునాథేశం జగద్వల్లభం॥

శ్లో॥ భక్తాకారయుతేన వాఽపి సముదారస్వస్తుతిః కల్ప్యతే
తన్మాత్రేణ కృపానుషంగితమతిర్భూత్వాచ తం చింతకం
చర్యా నాస్తి భవే త్స కోపి నితరాంసంపత్ప్రదో రక్షతి
య స్త్వం స్వామి శుభప్రదంచ గురునాథేశం జగద్వల్లభం॥

శ్లో॥ "నాహంజ్ఞానయుతో, ధనేన, సకలాపా, న్నాతివిద్యాంచితో
నానాసేవకచేష్టితో నచ, పరందీనోఽతిదుఃఖాకుల
స్త్వన్నాంపాలయ! కింయశోమరపతిస్తౌప్రియత్వాదికా"
చిత్తమ్మద్ధృది భావయామి గురునాథేశం జగద్వల్లభం॥

శ్లో॥వందామహేవిబుధబృందావనం త్రిపురసందీప్తవైశసహారం
మందాకినీవరపదాందోళికాయితజటం దానవాతిభయదం
కందర్పదర్పహరణం దుఃఖభక్తజనసందేహాశోషణకరం
నందీశగం ప్రమథసందోహసేవితమముందోషశైలకులిశం॥

శ్లో॥ మురాసురాంతకాదిదేవపుంజవందితం పరం
పరాంబికామనోహరం సమన్మనీశ్వరాకరం
గురుప్రికాండశంకరం త్రికూటమధ్యసుస్థిరం
సదా ముదాహ మాశ్రయామి సత్కృపాపరం హరం !

శ్లో॥ సమస్తపాపావనిభృచ్ఛతారం
జలేజజాద్యాశ్రితమోదకారం
వికారదూరం విమలప్రకారం
సదాభజేహం గురునాథదేవం ॥

శ్లో॥ యశ్చ యశ్చ మమ కష్టకారక
స్తస్య తస్య శుభసద్గుణానిచ
స్థాప్య మానసతలే నిరంతరం
పాహి మా మభవ ! పార్వతీపతే !

శ్లో॥ శంభో ! తావకజూటకోటరగళద్గంగాఝరీసన్నిభాం
నానాభావసమన్వితాం సుకవితాం ప్రాప్యా జగజ్జీవనం
కర్తుం యుక్తధనానుకూల్యకలిత స్సత్పండితైః ర్వేష్టితో
య స్తస్మా ద్భవదీయనిర్మలకృపాపాత్రోభవే త్కోజనః ?

శ్లో॥ భవే తత్కవిత్వాతివిలాసమానితో
భవే దమందేశ్వరతావికాసితో
భవ! త్వదంచద్గుణతా మపేత్య, శో
భవే ద్విముక్తో భయకారిసంసృతేః?

శ్లో॥ దూషణకరదుర్ధానవ
శోషణ! మునితోషణవృజినాకరసం
భీషణ! గంగానిలభూ
ఘ్యాషణ! వందే భవచ్చరణయుగళం!

శ్లో॥ శ్రీమద్గుత్తపురమహో
బాడీపేటాఖ్యవీథికాయాం యో
గురునాథే నేడ్యస్తం
గురునాథేశం భజామ్యహం భక్త్యా!

శ్లో॥ తస్మాన్నిత్యోత్పాటనార్భకాల
గురునాథాగ్రజసుతస్య వేంకటపు
న్నార్యస్యార్యానాథో
దీయా దానంద మతికృపాయుక్తః!

సీ॥ శ్లో॥ వరగర్తనగర్యార్య వైశ్యపర్తకజన
ప్రకరరత్నాయితప్రాభవేణ
దానధర్మక్రియానూనేన సప్తసం
తానోదునిర్మాణతత్పరేణ

ఉప్పుటూరికులార్ణవోడునాథేన స
ద్గురునాథపదభక్తితో నిషితేణ
గురునాథవరనామసరసేన గుంటూర్పు
రే తిలకఖ్యాతిరీతిలలిత
గీ॥ బ్రాడిపేటాఖ్యభాగ ఆరంభితాచ
శివకరశివప్రతిష్ఠాపన విమలకృతి
రపి తదీయావశిష్ట క్రియాకృతా త
దగ్రజసుత వేంకటపున్నయాభిధేన॥

శ్లో॥ తద్భవ్యదేవాలయసుప్రవిష్ట
స్సాంబాగజేశోత్కవిభావిభాసీ
గురుప్రభావో గురునాథదేవో
ముదావ తూప్పూరి శుభాన్వవాయం ॥

శ్లో॥ మాం పాలయానుకంపా
కంపితహృదయేన దేవ ! నవమందార
స్యాదిమకరందసుందర
కవితా ! రచనోత్క–వేంకటాఖ్యాకం ॥

శ్లో॥ ఏతచ్ఛందశ్రికళాప
ద్యాంచన్మాలా భవే ద్విభూషా తే
వృజినవ్రజగిరిభంజన
కులిశాయ భవాయచ గురునాథ ! శివ !



శ్రీ రామచంద్రాయ నమః

శ్రీగురునాథేశ్వరాయనమః

# శ్రీ

# గురునాథేశ్వర శతకము.



శా॥ శ్రీసర్వంబగునాంధ్రదేశమున వాసిన్వన్నెయుంగాంచియొం
తో పొల్పొందిన గుప్తపట్టణమునందుఁ శ్రీమదుప్పూరివం
శాపారోరుయశస్కరుండు గురునాథాఖ్యుండు పూజింపఁగా
నేఁపుంజూపెడు నిన్నుఁగొల్తు, గురునాథేశా! జగద్వల్లభా!

శా॥ యత్పాదాబ్జయుగానుషక్తమతిబ్రహ్మాదుల్ స్వకీయక్రియాం
చత్పారమ్యముగాంచిమింతురో? యనన్యప్రాప్యతౌల్యంబు, త
త్పత్పాదాబ్జయుగంబుఁగూర్చి రహిఁ సేవంజేతు, వర్ణించెదన్
హృత్పద్మంబునఁగొల్తు, భక్తి, గురునాథేశా! జగద్వల్లభా! 2

శా॥ ఆయుర్నీతిని జెంతఁజేరియు, మనంబందున్ భవద్ధ్యానముం
జేయంబూను మృకండసూనునసువుల్ నీరేజమిత్రాత్మజుం
డాయట్లుక్కనసీడ్వ, లింగమునఁ బ్రత్యక్షుండవై, భీతు నేం
తేయాయంతకుఁజేసినావు; గురునాథేశా! జగద్వల్లభా! 3

మ॥ అలఘస్వ్వాసురునంతదుష్టుఁడును వే ధ్యానింప, నవ్వానికీ
వెలమింగన్నడి, వానికోర్కెయదియెంతేవెక్కసంబయ్యు,నీ
య లలింబూనిననీదు భక్తపరతంత్రానూనభావంబు నీ
యిల నగ్గింప నెవండు చాలు? గురు ... 4

మ॥ దినముందాశతపంకజార్చనముభక్తిన్నిక్కుఁజేయంగఁబూ
నినకంజాక్షుఁబరీక్ష సేయఁగ మదిఁ జింతించి, యా పంకజా
తనికాయంబుననొండుమాటి,యలపద్మాక్షుండుపద్మార్చనం
బెనయంగొంటివి; దేవ ! నీవు; 5

శా॥ జ్యోతీరూపుఁడవై జగన్నికరమందొప్పారి, యాబైటను
బాతిల్లంగఁ జెలంగి, యోగిచయహృత్పద్మాసనాసీనతా
భూతింగాంచి, వివిక్తగోచరగుణంబుం జెంది పెంపొందునీ
వేతీఱొప్పఁగ నన్నుఁబ్రోవు; 6

శా॥ నీకుఁ వందనముంబొనర్చెదను,వాణీశేంద్రవంద్యాంఘ్రి ప
ద్మా! కుందేందుతుషారహారధవళాంగా! వాతభుగ్భూషణా!
ఆకాశోరుజటాకలాపశశిచూడాలంకృతా! శూలభా
రీ! కైలాసనివాస! దేవ! గురునాథేశా! జగద్వల్లభా!

మ॥ ధర తేరై, నిగమంబు లశ్వచయమై, తన్మేరువే చాపమై
సరసీజాక్షుఁడు బాణమై ఫణిపుఁడుం జ్యావల్లియై, శారదా
వరుఁడే సారథియై చెలంగఁ ద్రిపురాభంగోరుగర్వంబు భం
గురతంగాంచఁగఁజేసినట్టిభవదంఘ్రుల్ గొల్చి, యాంతర్య బా
హిరజాడ్యంబును బాపికొందు; 8

శా॥ "నిన్నున్నమ్మినవారికెన్నఁడును రానేరావుకష్టంబు" లం
చున్నిత్యంబును బెద్దవారలను నీశ్లోకంబునాలించి, నీ
యౌన్నత్యంబుదలంచితిన్ ద్వర మదిష్టావాప్తి సేకూర్పవే?
యెన్నన్ నీకు సముండు లేఁడు; గురు ... 9

మ॥ అసిధారావ్రతచర్యఁ బోలిన పరీక్షాదేశముం గొల్పి, త్వ
త్కృపసదాచద్గతి వర్ణసంజలుషసందర్భంబుఁ జేకూర్చి నా
వు సరోజాసనవంద్య! యిట్టివిషమంపున్ శోధనన్నిల్చి, నే
నెసఁగింపంబుదునా ? గిరీశ! 10

మ॥ జగతీబంధుఁడు హేళికన్నొకటియై, చంద్రుండు వేఱొక్కక
న్నుగఁ బొల్పారె, హుతాశనుండు నొకకన్నుంగాఁ జెలంగంగ లో
కగురుత్వంబునుగన్న నీవన, నరోగత్వోర్వరుధీసత్ప్రభా
దిగుణంబుల్ దయసేయలేవా ? 11

శా॥ తండ్రీ! "భక్తుల నెల్లఁ జాలఁ గరుణౌదార్యంబునన్ వారివా
వేఁడ్రింబౌనిడుముల్ హరించియును వేవేపోత్రు"వంచెల్లవా
రండ్రిర్యల్ మఱి ఆచుడుల్ వినియునిన్నర్థించితిన్ ;నావియౌ
తీండ్రింబౌశ్రీమలన్ హరింపు ! 12

మ॥ కలయన్నింటను, నన్నిరూపుల నెసంగంజాలి, యవ్యానిశ
వ్వలనేకాకృతి నంతెఱుంగఁబడకొప్పారంగనై, సర్వవ
స్తులలత్కారణమూర్తి నీవు, ననుఁ దృప్తుం జేయవే? శూలధా
రి ! లులాయాసురహారిణీప ! 13

శా॥ అంతాపేతతనున్న నీ తెఱఁగుఁ దానాలోచనం జేసి, సు
స్వాంతంబొప్పనుతించుశౌరి ఘనుఁడై సర్వేశ; మఱి దావకీ
నాంతాపేతత గన్నటున్నటఁ సే ను బ్రహ్మ చేటొందె; నీ
వెంతంచున్నతియింతు? దేవ గురు ... 14

శా॥ తల్లిందం డ్రియుదైవముంగురువుఁదత్యంబీవె యంచెన్ని తా
ముల్లాసంబునఁబల్కు పెద్దనుడులే నొక్కింతయాలించి, నా
యుల్లంబింత స్థిరంబుగాదు, మదినెంతో తెల్విన్ గాంచ న
న్నెల్లరీతులఁ బ్రోవుమయ్య 15

మ॥ ఒకవంకంధన, మొక్కటక్ యశము, నింకొక్కంట
సౌఖ్యంబు, ని
ట్లకలంక ప్రమద ప్రదస్థితుల నేఁపాఱంగనుం జేసి, చి
క్కుక ముంగొల్పఁగ, దాననన్ని సుకముల్ గూడన్మదంబిచ్చునే
మి? కదుర్ బాల విసంబువోలె 16

శా॥ ఓకైలాసనివాస! యోపశుపతీ! యోవిశ్వగమ్యాకృతీ!
శ్రీకంఠా! యభవా! భవాబ్ధితరణీ! చిన్మోదసద్దీపకా!
నాకేశాదిసమస్త భక్తనత! కంజాతాంబకా జ్జార్జితా!
ఏకశ్రీకర! తే నమోస్తు? 17

మ॥ కనదుత్తుంగజటాభరంబునను వీఁకంగంగ జాల్వాఱ, మే
ననువాతాశనభూషణంబులెసఁగన్ భస్మానులేపంబు తె
ల్వినిగొల్పన్, డమరుత్రిశూలకరతన్ లీలన్ శివన్ గూడి, హా
యినిడన్ బొల్చెడినిన్నుఁగొల్తు గురునాథేశా! జగద్వల్లభా॥ 18

శా॥ జ్ఞానశ్రీవిషమాంబకంబునను సంసారాతి రేకప్రద
శ్రీనేర్తే విషమాంబకుండనిమి, కీర్తిం జెంది, "కామారి" నా
నైనన్ మేనసగంబు భార్యకును నీనైనావు; నీలీల లే
రేనం జేరి " యిదమిత్థ " మంచు? గురునాథేశా! జగద్వల్లభా॥
మ॥ పునుకల్ పాములు భూష; లేన్గుచరుమంబుండాల్తు,
[వస్త్రంబుఁబు
ఘ్రానబిచ్చంబును గొందు; వింక మెయినర్ధింబూదినింబూసికొం
గనెర్ల్యంబుచెవ; విట్టినీవఖిల భాగ్యంబుల్ దయంగొల్పు లే
మొనయున్నీదువిచిత్రలీల; 20
మ॥ తెలికొండ, న్నలిమేన నంటుఁదెలిబూదింబూసియున్ దెల్లచం
ద్రునిబూఁ జేసియుఁ, దెల్లయేరుజడలందున్నిల్పి, తెల్లెద్దునె
క్కినసీకుంగొఱతూనె, తెల్లనగుసత్కీర్తి? న్నినుంగొల్వ, హా
యిని దెల్పంగనసందియంబె ? 21
మ॥ కడురూక్షేక్షణుఁడై యముండపుడులాఁగన్ బాశముం
బూనియున్
విడువంబోకత్వదీయవిగ్రహము రావే కావవే? యీశ యుం
చును నార్తున్ ధరణీసురార్భకుసినొయ్యన్ బ్రోవ,లింగానసీ
వెనయం గన్పడినావు; దేవ ! 22
మ॥ యమవక్షంబగలంగఁదన్నియునుభూమ్యాక్రాంతునిం జేసి ప్రే
మముపెంపాఱమృకండసూనుతలపైమువ్వంబుగాహస్తముం
చి,మరందోక్తులనాయురున్నతివరశ్రీలిచ్చునో దేవ ! నీ
కె మతి న్నే నతులం బొనర్తు; 23

మ॥ తలపై గంగయుఁ జంద్రుఁడుఁ దుక్ వెలయ, నందంబైన లేనవ్వు మొ
 ల్కలు చంద్రుక్ హాసియింప, హ స్తమును మార్కండేయు
 శీర్షంబునం
దొలయం జేసి, భయంబువాఁపిన కృపా ప్రోద్యద్భవన్మూర్తి మా
 కెలమిం గూర్చును గాత! దేవ! గురు ... 24

మ॥ శివముం గూర్పఁగ నీవు దక్షుతను వేఁజెన్నా తినావంచు నీ
 యవసింగొందఁ ఉపల్కి; రయ్యు, శివమే యాదీవు; నీవింక వే
శివముం గొల్వఁగ సందియం బె? నిను నేఁజిత్తంబునం దెంతు; శూ
 లి! విశేషంపు శుభమ్ములిమ్ము! 25

మ॥ అమృతావాప్తికి దేవదానవులు క్షీరాంభోధిఁ ద్రచ్చంగ, లో
 కములన్నింటి హరింపగల్గు విలయోగ్రజ్వాలికా భీలరూ
 పముతో హాలహలంబువుట్టఁగ భయభ్రాంతాత్ములా వారినీ
 వె మహాప్రేమను బ్రోఁచినావు; 26

శా॥ జ్వాలాజాలజటాలమై యటు జగజ్జాలంబు గాల్పంగ, నా
 త్వేళం బెంతో విజృంభిలక్, సురముఖుల్ భీతిన్నినుం జేర, నా
 భీలాకారముఁ దద్విషంబు గడు వేవే నుంచినావయ్యా స
 ల్లీలంగొంతున; నీలకంఠ !! 27

మ॥ "వెలి బ్రహ్మాండని కాయ ముండు, మఱిలోఁ బెంపారు
 బ్రహ్మాండపం
 క్తులు, కానక్, విసమద్దిలో బయట నెందుం గాని లేకుండఁగా
 గళమందుంచియు, నీలకంఠత జగత్కల్యాణసంధాతవై
 మెలమిం గూర్చితి విద్దెజోత; 28

మ॥ పరఁగన్ లోకనికాయమెల్లను భయభ్రాంతంబుగా, నల్లదు
ర్భరబాధల్ త్రుటిలోనఁ బాపఁగలదేవా ! నీవు మాకొంట్ల బా
ధరయం బేహరియింపనెంతయోః కృపాతాత్పర్యముం గొల్పి,
మా । కిరవుం గొల్పుమ ! మేలెసంగ; గురు ... 29

మ॥ పరమంబై తగుభక్తితోడనినుఁ గొల్వన్, జెందరానట్టి మే
ళ్లురహింగన్నపుడ; వట్టినీకరుణయే లోకైకశానందద
స్ఫురణన్ మించెనే; నిన్ను వేఁడెదను, మా కొప్పుల్ విచారించి హా
యిరయంబిమ్ము ! వెతల్ మరల్చి; 30

శా॥ శ్రీనత్కీరఫణీభకన్నయముఖాశ్రీ నాశ్రితవ్రాతము
ల్లైనిన్నుం భజియింపనేర; ననునీ చెంతే కృపం బ్రోవవా
జానైమించెడివారిఁ బ్రోచుటొక హెచ్చా ? దీనతన్ గన్న ధీ
హీనున్ నన్ దయఁ జూచుటొప్పు; 31

మ॥ జగతీమండలజాలమందలి రజస్సంఘంబు, నింకన్ వియ
ద్భగణంబున్, సకలాబ్ధివారికణముల్, తద్ధరశీర్షజెప్పెమెం
చఁగ, నా మొత్తముకన్న మించును భవత్సన్నుత్యలీలాగణం
బిఁగ నిన్నేరనుతింప నౌను ? 32

శా॥ ఏమీ నేరనివాఁడనై యెదియు యత్నింపన్ బ్రమాదాధ్వగ
శ్రీమత్తుంగని, మంచివారలని పేర్కొన్నీచులఁ గొల్చి, యో
స్వామీ ! యేదరిదాఁపుఁ గానక, తుదిన్ స్వాంతమ్మునందోచి. ని
న్నే "మే"లంచును జేరినాను; 33

మ॥ వరుసన్, "బ్రహ్మరమేశశంకరు"లనన్ బ్రత్యేకనామంబులన్
బారిసృష్టిస్థితిలీనకృద్గతులకై పూనంగనైనట్టి నీ
తెఱఁగుల్ గావె? యిదెంచ, కజ్ఞు"లవియెంతేభిన్న"మంచెంతురిగా
దె? గుణాఢ్యా! యటలాభమేమి? గురు ... 34

శా॥ వేమాటల్ పనియేమి? "నీవెహరి, నీవే బ్రహ్మ, నీవాదునీ
వే, మాద్యత్సకలాబ్జజాండములు నీవే, సర్వగా సర్వభూ
తామందాకృతిపీ"వఁటంచును, ద్వదీయాభ్యర్చనం జేయువాఁ
డే మాన్యుండగు; దేవదేవ! 35

మ॥ పారిజీవాకరముల్ త్వదాకృతిగణంబుల్, సత్య, మిద్దానిఁదా
నెఱుఁగంజాలినవాఁడు జీవవితతిన్ హింసించునే? "హింసక
స్ఫురణంబెల్ల భవద్విదూరగుణ "మన్ పాత్ర్పవివేకంబగున్;
తెఱఁగిద్దాని ఘనుండెఱుంగు; 36

మ॥ "జగమెల్లన్ భవదీయసంతతి"యటన్ సత్యంబు గ్రంథంబులం
దుఁగరంబుంబఠియించి, హింసకయి యెన్నోయత్నముల్ సేయువా
రిగుణం బేమనవచ్చు? సత్కరుణఁ బేర్మింబోలు యోగ్యత్వమే
దిగనన్ వచ్చు? బురాసురారి? 37

శా॥ చంపంబూన, నయోసిచే వెగటునా? స్వర్ణాసిచే సౌఖ్యమా?
దుంపం ద్రెంపఁగ నేదియే నొకఁడె, జంతువ్రాతసంహారక
త్వంపున్ రీతి కిరాతయజ్ఞకృతులన్ బర్వ్యంగ దాచావు; లే
యింపుంగూర్చునో నేనెఱుంగ 38

మ॥ తన, నెందో యొకరంభ, యెడ్డా? కడుతాత్పర్యంబునఁ జేరునం
చును, సప్రాణినొకండు సంపుటదియే చొప్పోకదా? దానని
మ్మనముందుఱ్ సుకముండునా? సకలసామాన్యాశయంబున్నరీ
తిసిసౌఖ్యంబు చెలంగఁజాల; గురు ... 39

శా॥ నిన్నెంచఱ్ వలె, నీదుభక్తులను మన్నింపఱ్ వలెఱ్, లోకమె
ల్లన్నిరూపముఁటంచు జీవినికరోల్లాసంబు సంధింప య
త్నౌన్నత్యంబున నుండఁగావలయుఁ; గర్తవ్యంబులందివ్వితా
మెన్నంగాఁబడనౌనుజాల; 40

మ॥ తనయుద్దేశము బాగుగా నెసఁగి, యత్నం బెద్దియేఁ జేయు, దా
ననులాభంబదిరాని! లేకెసఁగనీ! నల్వాలఁగా, దానిన
ల్లను నీకర్పణచేసి, యెప్పటికి హేలఱ్ సత్కృతుల్ సేయఁగా
నెనయుఱ్ జ్ఞాని; మృగాంకమౌళీ! 41

మ॥ ఇతరుల్ నిందయొనర్పనీ! కనలనీ! ఘెంతేని స్తోత్రంబుచే
సితగఱ్ మెచ్చఁగనీ! యవెల్లమదిలోఁ జింతింపకే స్వీయరీ
తితనన్నచ్చినయట్లు సేయునుగదా? ధీరుండు? దివ్యజ్జగ
త్త్రితయాధీశనతాంఘ్రిపద్మ! 42

మ॥ శివ! భక్తార్తినిబాఁప, కెంతయునుతిం శోకొంచు, మేలీక, యూ
క వెసంగ్రాలెడిలీలయేమిటికొ? భర్గా! భక్తునింబ్రోవకు
న్నవిధిఱ్, నిన్నుయజించులాభమది యున్నా? నన్నతాసత్కృపా
లివికాసంబున నన్నుఁబ్రోవు! 43

మ॥ తెలుఁగుల్ నీ విచిత్రముల్ గద? హా రా! తీఱెప్ప సేవించి, యె
క్కరణిన్నిన్ను నుతించు మాకు శుభముం గావింపుమా! వేగ; ని
వ్వరుసం దామస మేల? నామదిఁ గడున్ బాధాగతిం జెందె; హా
యిరహింపం బొనరింపు! దేవ! గురు ... 44

శా॥ తల్లిం దండ్రివి నీవు; నీ తెలుఁగులై దైవాఱుకున్ దల్లిఁదం
డ్రుల్; లోకేశ్వర! కాన, వారలనొగిం గాల్వం బ్రయత్నించుచే
యెల్లం గార్యములందు మిన్న; యటు కాఁ; యీభూమిఁ దద్భక్తులన్
దెల్లం బొనటుఁ బ్రోవు! దేవ! 45

మ॥ ఒకయింతేనియు లేదు, భూతపతి! మా యోగ్యత్వ మెందేని; స
యకలం బాదరణ ప్రకారమున నేయందందు మాన్యుల్ నితాం
తకృపం గాంచిరి; కాన, నీవయిపుడున్ సంతోషముం గొల్పుమా!
యికనాలస్య మదేల నేల? 46

మ॥ "కటికల్ మే" లనఁ బ్రకృతి, దుష్కార్యస్థితిన్, దోషలం
పటతత్వంబుఁ, బ్రతారణక్రియయు నేఁ పాటింగనై, తాముఁ
పటుయుక్తుల్గను ఘోషణంజలుపు నవ్వాచే ధరాదేవులా?
యెటు లౌదు ర్నినుగాంచకుండ? 47

శా॥ "వందే ధ్రేందుకళాపరిష్కృతజటాభారాయ భావాయ, వా
తాంధః పాలకకంకణాయ, భవతే ధర్మాస్థిరా" యేతివా
క్సందోహంబుఁ గొల్చువారలకు మేల్ చయ్యాగనం జేతుప
ట్లిందున్ వేఁడితి నిన్ను దేవ! 48

మ॥ ఇఁకనే నేమొనరింతు? "సర్వముఁ ద్వదీయేష్టంబు, నా భాగ్య" మం
చకళంకుల్ మహనీయులాడినటులన్ స్వాంతంబునం దెంచ నా
నొకరీతిం దగ; నట్లుచేయుట కెయొంతో నాకునిష్పించు వా
యికదా? లోకశరణ్య గణ్య! 89

శా॥ న్యాయాన్యాయవివేకమిఖ్యసుకముల్ న్నల్వాటినన్గష్టము
ల్వేయైవచ్చిన, మోదదుఃఖములు హృద్వీథిన్ ప్రవేశింప, క
త్యాయత్తోరు ప్రశాంతిభావముఁ గృపావ్యాపార! యే
పాఱ! నీవే యీవే? వృషరాట్తురంగ! 90

శా॥ "ఉన్నా"వంచును,"భక్తబృందమునునీవుల్లంబునిండాటిసా
ఖ్యోన్నత్యంబునుగాంచఁజేయు"దని నేనాలించి యిట్టా వేసినా
నున్నట్లోకనిదర్శనంబుగను నాయుల్లంపుఁగోర్కెందగన్
దెన్నేర్పాటుగఁ జేయవేర? 91

మ॥ చిరసంపద్యుతుఁడుప్పటూరిసుకులక్షీరాంబురాశీందుఁడా
గురునాథార్యుఁడు, గర్తపూర్ణిలయుఁడీక్షోణిస్థలిన్ బల్ నిరం
తరకీర్తిన్నిలుపంగ, సప్తవరసంతానంబులంగొల్పమేల్
తెలుఁగుంబూనెద్వదాశ్రితుండు; 92

మ॥ లలిశ్రీసానకగోత్రుఁడుప్పటూరి గుర్నాథుండు, శ్రీకోశమా
లలనాధీశుఁడు, గర్తపూర్ణిలయుఁ, డుల్లాసార్చితార్యుండు
భాసురమారీతిని నీమసేవఁజలిపెన్ సొంపాఱ; నాథీపు సు
స్థిరకీర్తిన్ వివరింతునీకు; 93

మ॥ ధరణింగ ర్త పురీవతంసమెసఁగుర్ దానర్ ఘనుల్ వైశ్యులు
ప్పురివంశ్యుల్ కలరందు సోదరులు భవ్యుల్నా రసింహార్యుఁడు
న్గురునాథాఖ్యుఁడు నొప్పి: రెంతయు వదాన్యుల్; వారు
చిన్నప్డు బల్ । తిరుపుందీనతఁగుంది రెంతో 94

మ॥ సాధింజిన్నతనంబునుండియును, వార్సుజ్ఞానులై, నర్తక
స్ఫురణన్ దేశవిదేశ కాల్యవివరంబుల్ గాంచియున్, బేరముల్
జరుప, న్నీకృశ చేత ద్రవ్యమదిలజుల్ చేర, నెం తేని సు
స్థిరసంకద్గతినొప్పుటయ్యె; 95

మ॥ అరయం బేరములందు ధైర్యమున దీవ్యత్కాల్యముల్ కాం
చి, ముం
దటికంజెర్ రహించుచ, గర్తపురిలో ధన్యోప్పటూర్వంశ్యసో
దరయుగ్మంబును బోలు వారలరుదర్ తాత్పర్యమెంతేనినం
దెరయంబుర్ భువియందు; దేవ! 96

మ॥ ఇరువుర్ధీరు, లెసంగునిర్వారిగుణం, బిర్వుర్సదా దానత
త్పరు, లిర్వుర్వ్యశమిచ్చుధర్మమును దా త్త్ర ప్రక్రియం జేసినా, :
రొప్పెరినందుం గురునాథుఁడుండినపుడుర్ బ్రాల్ప్రెం దెధర్మంబుతో
విరహారీతి శ్రితుల్ నుతింప, 97

మ॥ ఇరువుర్ప్పెసిరిదానధర్మముల, నందిశ్రీకగుర్నాథుఁ, డ
బ్బురమౌనట్టుల వేనవేలుగవ్యయంబుం జేసెఁ, దానుండిన
ప్లై రహిన్నిల్పక జీవితంబిది దర్ హృద్యంబుగాఁ జేసెసు
స్థిరధర్మంబుల కెరుపాట్లు, 98

మ॥ అరయన్ శ్రీనరసింహు భార్య యలమేలంబావతంసాబ్జు శ్రీ
గురునాథాంగన రోశమాంబికయు నిర్గర్భ రత్నలంబాలి భా
సురధర్మాచరణాభిలాషిణులుగా సొంపొంది, బల్ కీర్తిన్
దిరమౌరీతిని గాంచిరుర్వి 99

మ॥ అనఘుండౌ గురునాథధీమణి, యుదారాగ్రేసరుం డుర్విదే
వనికాయం బుపనీతముం జలిపె, విద్వత్సంఘముం బ్రోచె, వే
ధననిక్షేపమునుం, బ్రసావసతులన్, ధర్మాన్నసత్రాళి, తా
నెనయం జేసె నతండు పేర్మి 100

సీ॥ నాల్గురస్తాలశృంగాటక స్థలియందు
నింపుగాఁ గానార మేర్పరించె
సుప్రకారంబుగా విప్రపోషణకయి
తగిన యేర్పాటుల నగడఁ జేసె
తగసాధుతతికి సదావృత్తి నియమముల్
స్థిరమైనరీతిగాఁ జెలఁగఁ జేసె
బ్రాహ్మణావళి కార్యవైశ్యావళికి నన్న
సత్రంబు నిలుపంగ సరవి గొల్పె
గీ॥ వెసను వాసవీనిత్య నైవేద్యపూజ
నంబులేర్పాటు గావించె డంబుమీఱ
నిలను జను లెల్లఁ బొగడంగ నింక నెన్నొ
సత్కృతులఁ గొల్పె గురునాథసరసుఁ; డథవ॥ 101

వ॥ మఱియు 102

సీ॥ లలితమంగళశైలలక్ష్మీనృసింహాదే
వాలయగోపురోద్వేలకలశ
నిర్మాణమును, మఱి విక్రమసింహప
త్పురరంగరాడ్గేహమునకు గోపు
రకలశస్థాపనరమణీయకృతిఁజల్పి,
హాటకృపాసత్పాత్రుఁడయ్యె, నింక,
సత్రసంతాననిచయమందుఁగాసార
ము, ధననిక్షేపంబు, భూసురప్ర
గీ॥ పోషణము, నన్నసత్రముల్ పొనరఁజేసి
విత్తమెంతో కోకొల్లగా వెచ్చపెట్టి
బీదలకు వేల్పుఁజెట్టుగాఁ బెరిమగాంచి
నట్టిజగజెట్టి శ్రీగురునాథసెట్టి॥ 103

మ॥ తగనింతే నియమించునంత గురునాథార్యుండుత్యద్దివ్యప
ద్యుగసాన్నిధ్యము చేరెఁ జేరునపుడుద్యోగించె స్వీయస్వమున్
జగతిన్ సంతతిసత్రకంబు మఱి నంచద్ధర్మముల్ చాలహా
యిగఁ జేయన్ సహజాత్మజాతు, 104

సీ॥ సరగవసత్రప్రతిష్ఠాపనకార్యంబుఁ
గూఢప్రతిష్ఠను గుధరచాళ
దేవాలయంబుఁ బ్రతిష్ఠించుటఁగృతిప
రిగ్రహణాంబును, సగ్రజాత

పుత్రుండు వేంకటపున్నార్యునియమింప
నాతండు చాలనుదారమూన
సనుచుఁబితృవ్య ధనమునకుఁదోడు త
నధనంబు వెచ్చించి, నవ్యరీతి

గీ॥ నల్లధర్మకార్యపతతిపోల్లసనముఁ
గొల్పెఁ, గొల్పుచున్నాఁడు, గొల్పఁగలఁడు
పున్నయార్యుండు పితృభక్తిపూరితుండు
నవ్యభవ్యాంగ ! శ్రీగురునాథలింగ! 105

మ॥ పదివే లాగురునాథధీమణి భవద్భవ్యాలయ స్థాపనో
రుదశార్థంబిడిపోయె, నల్లపని కారొక్కఁబు తక్కొటచేఁ
బదివే ల్వెంకటపున్నయార్యుఁడిఁక ద్రవ్యంబిచ్చినీయాలయం
బెద కానందముగాఁగఁగూర్చె 106

శా॥ దేవా! యిక్కలికాలమందుఁ బితరుల్ దీపింపనిడ్డట్టి ధ
ర్మావిష్టక్రియలుజ్జగింపక పౌనర్పంజూచు పుత్రాళియే
యేపీటంగనవచ్చుటుండ; దయినన్ హృద్యంబుగానిట్లు ధ
ర్మావిర్భాతికిఁ బిన్నతండ్రి యిడఁగానైనట్టి ద్రవ్యానక
ల్పవిత్తమ్మిడు వారలుండ, రటులేయేపాటినన్, దత్కృతి
శ్రీవిన్యాసులయందు నీమహితుఁడౌ శ్రీపున్నయార్యుండుభూ
మీవేన్యాడగుఁ ద్వత్కృపాకలనచే మేల్సంపదల్ కొల్పిస్వా
మీ ! వేనాళనిబ్రోవు మెప్పు 107

మ॥ పారిశృంగాటకసన్నిధిఁ జరసిరింబాల్పాఱఁగాఁ జేసెస్రశ్రీ
గురునాథుం డటనద్ది లేనపుడుబల్ కుందంది రయ్యర్థ్యగుల్
మతిశ్రీవేంకటపున్న యార్యుఁడది సెంపందింపగా, మూఁడు వే
లిర వాఁచేర్మి నిడంగఁ బూనె 108

మ॥ తగసత్కార్యములిట్టిమాన్యులుగుణోదారుల్ పౌనర్భ ధనం
బుగడింది విద్యయముంబొనర్ప, ఖలు లేమోసాయమొం తేని జే
యఁగయత్నించినటున్ స్వలాభమునకై యాయాయభిప్రా
యముల్। తెగఁగొల్పంబ్రియతింతుర్ చాల 109

మ॥ “ఖలులారా ! భువియందు మీ రుపకృతింగావింపుఁ”
డంచేనుగో
ర, లర్థిఁ జర్గఁగనున్న కార్యములకుఁ రంగంబుభంగంబుసం
ధిలఁగాఁ జేయకుఁడయ్య; యద్రైపది వేల్ ధీరావళీ”యంచుసి
వెలమిందుష్టుల కెల్లఁ దెల్పు 110

మ॥ వెస‘మాయింటికిమీరు వచ్చునెడ సేవిత్తంబు మాకిత్తురో?
వెసమీయింటికి మేమువచ్చునెడ సేవిత్తంబుమాకిత్తురో?
పసమీ’ రంచువచించు స్వార్థపరు లేపల్మాల్మటింత్రెంత యో
నసఁగందోడుగ ధర్మనీతి 111

శా॥ ఏమాటైననుసాయమీయరుగదా !యేమాటయోపల్కిన
న్దామందుం గడులాభమంద నిది వాగ్ధాటింబ్రసారింతురే?
స్వామీ!“లాభము లేక సెట్టివఱదన్ బాఱం”డఁటన్ మాట యిం
కేమేకొల్పి యుదాహరింతు।! 112

మ॥ ఇతరుల్ కోరినదేదిగాని అదియొంతే వారికింగష్టమా
స్థితిగా నుండఁగనీ యొకింత ఖున మేల్శ్రేయర్స్వలాభంబును
ఖ్యాతిగాఁ జూచెద రట్టిపెద్దలను సాయంబీయఁగోరంగనే
నె తగన్నీకృపయున్నఁజాలు। 113

మ॥ ఒకమాటన్ వచియింతు దేవ! భువియందా ప్రాణసంతానస
త్తకముం జేసినపుణ్యశాలి, విలసద్వైశ్యావళిన్ లేఁడఁట
న్నకళంకుండగురునాథుఁడాగెఁగనుకన్ "బ్రాణంభకుండీత"డం
చిఁకమించుం గురునాథమౌళి 114

మ॥ ఇలయందాకొక్కగీము ముంగలను నెంతేబాగుచేయంగన
ట్టులగ్రామంబునకున్ శుభ మెసఁగు; నట్టుల్ దేశమంకున్ జనం
బులసంఘంబు లోకంబోకండు, బెరిమింబూనంగనైనన్, గరం
బెలమిం దేశముగాంచుఁగాదె 115

మ॥ పెరసంఘంబులుమించి,స్వీయవిరతిన్ బెంపుం జెడం జేయువన్
విరసత్వంబెదనూని, యన్యసముతుల్ వేపాడుసేయ భువిన్
బరఁగంగావలెనైక్య, మిన్నిభిద లేపాటింగరా"దంచు, న
త్తెఱఁగే "నేరికివారె యైరియ మునాతీ రే"యఁటన్నట్లు సం
ఘరుచుల్ప్రోత్సనఁటుంచుఁబల్కినమహా ల్యాణము గోరితా
మిరవౌయుక్తిని గొందఱుండ్రు; 116

సీ॥ శ్రీమంగళగిరి లక్ష్మీనృసింహాలయ
గోపురకలశంబు గొల్పెనెవఁడు,

పొరినివిక్రమసింహపుర రంగరాడ్గేహ
గోపురశిఖరంబు గూర్చెనెవఁడు,
విజయవాటీపురీ విమలాంతి కేంద్రకీ
లాద్రిమఠము నిల్పె నమర నెవఁడు.
కాటికొండాభ్యర్ణధరణి శృంగాటక
తోటిందటాకంబు గూర్చె నెవఁడు,

గీ॥ ఇఁకను గన్యకా నైవేద్యహృద్యకృతిము
ఖోరుకార్యముల్ పొనరించి, యుర్వి(గీర్తి
గన్నయుప్పూరి గురునాథగణ్యకృతుల
నతనియగ్రజసుతుఁడు పున్నాభిధుండు
పూర్తిగావించి, సుయశంబుఁబొందె నెలమి॥ 117

శా॥ శ్రీపున్నార్యుఁడు చేసినట్టిదగు నీశ్రీకంఠగేహప్రతి
ష్ఠాపుణ్యాపుఁగృతిఁ దదన్వయముఁదత్సఖ్యాధ్యులున్దానుస
ద్వ్యాపాగాంచితలోకమాః తసుకీర్త్యైశ్వర్యముంగాంచి పే
రేఁపుంగాత్రు భవత్కృపాప్తిఁ 118

శా॥ శ్రీద్రై వాఱంగఁబున్నయార్యుఁడును, దచ్ఛిష్టాన్వవాయంబునా
మోదంబొప్పజగత్సుఖోదయకృతిస్ఫూర్తిఁ లసత్కీర్తిచే
మాద్రుక్సత్కవిమండలంబుతమసామంజస్యమెంచంగ, నెం
తేఁ దామొక్పదు రిపుమీఱ 119

మ॥ పడిగర్భాతురరీతి శబ్దముల స్వల్పంబౌనటుల్నేర్చి, యా
నుపులందాఁగడుగౌరవంబుగన నెంతోకోర, వేదోక్తుఁడా
నుపులన్నేర్వఁగ, నోర్చునేజపుఁడు? మాన్యుండట్టులం జేయునే?
యొకసర్వత్రైను మేలుగోరు; 49

మ॥ కడునద్దంబగుపాటులన్ని పడియుంగానీ! దురన్యాయపుం
జెడుగుల్ల్వాల్పియుఁగాని, తుట్టతుదిఁదాఁ జేటొందియుంగాని, మూ
ర్ఖుఁడుసత్పాళికిఁ జెందనాశుభపుఁ డీకుంబాఁపయత్నంబు; ని
య్యోడఁదత్సజ్జనుఁ బోవవాక్కా? 50

మ॥ ఒరులేసత్కృతినేనిఁజేయ, నదితామొక్కంత చేయంగలే
నిరసాభాసపురీతినుండియుసు, దానింగూర్చి, వ్యాఖ్యానముల్
జరుపంజూచుట చీడచెట్టుఁ బెనుకన్ లావేఁదియున్ జెట్టువే
నెఱయంజేసెడిభాతిదోఁచు; 51

మ॥ బ్రదుకన్ వైద్యునికట్న మొప్పఁజనినన్ లాభించుగోదాన మం
టదగన్, సత్ప్రతిపాదుసేయు నెవిరో నాడెంబులంబల్కియున్;
దుది నక్కార్యమెసంగఁ గీర్తితనకున్ గోరున్, జెడన్ గర్తపై
నెద వెక్కించును దుష్టుఁడెందు; 52

మ॥ సమతంబూని, సమస్తసత్కృతులనుం జల్పం, బొనర్పింప, డెం
దమునం దెంతయునుత్సహించి, పరవిశ్వాసంబునుం గాంచి, యు
న్నమహాలాభముగాంచి, తుష్టిఁ బడుచున్, దైవాత్మ, బ్రహ్మంబుని
న్నెమ్మదిన్ గాంచును, బ్రాహ్మణుండు, 53

శా॥ వేఁగిన్ లేఁచినదాదిఁగల్లలను వేవేఁబల్కి, యుద్ధావళిన్
కేఁగం జేసియుఁ, గూటసాక్ష్యముల నర్థిన్ గూయనై పాపవి
ద్యాగణ్యాత్ములెయయ్యు, దానములకై యచ్చోటఁ బ్రాహ్మణ్యమెం
తేఁగాన్పించిన, న్యాయమెక్కడ? 54

మ॥ పెఱజాతుల్ జగమందుఁ గీర్తిగనఁగాఁ బెంపాఱ, నేనీతులో
పరఁగం జేసిరొ, దొంగమైత్రిగనిరో, పల్మాఱు మన్నించిరో
విరసత్వంబులఁ గొల్పిరో, భయము వేవేఁ జూపిరో, వారిమే
లెఱయం జేయునె? బ్రాహ్మణుండు? 55

శా॥ నీతత్వంబును జక్కఁగా నెఱుఁగ యత్నింపంగనై యెంతయున్
నీతత్వంబుగనుండి, కోపమది యెంతే లేక, యన్యోపకా
రాతిప్రాభవమొప్పి, లోకమునఁ గల్యాణంబు సంధింప నెం
తేతీఱొప్పును బ్రాహ్మణుండు; 56

మ॥ జగతింబర్వెడి జాతిమాండలికి నెంచన్ సద్గురుత్వంబుఁ జెం
దఁగఁ దామర్హులమంచుఁ బల్కుచును లేనాడెంబునుం బాసియున్
"జగతిన్ మంచితనంబులే" దనెడిభావల్ నాయమా? తాము నీ
తిగ మించం జగ మొప్పఁగాంచు; 57

శా॥ వేమాటల్ వ్రచియింపనేల? వినుమా! విశ్వేశ్వరా! బ్రాహ్మణు
ల్వా మాన్యంబుగ సత్ప్రవర్తనశుభప్రారంభసంరంభులై
వ్యామోహంబులఁ వీడినన్, బిదపనేపై వారికిన్ సౌఖ్యమెం
తేమించంగ నెసంగు, దేవ! 58

మ॥ మదిలోనమ్మిక కొద్దియన్యమతపున్ మర్యాదఁ బూనంగనొ
ప్పిదమే; పొట్టకు నాల్గుగింజలను వేవేఁజెంద వేఱొమతం
బుదగం జేరుటకన్నఁ దప్పిదియుఁ దాఁ బాల్పాటు నేశూలధా
రి! దయామానితమానసాధ్య! 59

మ॥ స్వమతం బెంతయుఁ జెడ్డటు, న్దమదు భాషా వేషముల్ బాగులే
నిమతిన్, వేఱుమతంపు భాషలను, దన్నిలిన్ పలిన్ వేసముల్
ప్రమదంబొప్పఁగ బూనినంతట నె మర్యాదా ప్రకారం బెయా
నె? మహిన్ మింతురెవారు? దేవ! 60

మ॥ "తనదైనట్టి మతంబు దుష్ట"మనియున్, "దక్కొండుమే"
లంచుఁదోఁ
చిన చోఁగా, కిలఁబొట్టకన్యమతముం జేరన్, నిజంపున్ మతం
బునయందింక నన స్వర్గాప్తి, మఱినన్యాబందుహాస్యత్వ మి
శ్లైనయుంగావలదే, జనుండు? 61

మ॥ ప్రతితంత్రాంగనియుక్త సౌఖ్యవిషయప్రాగల్భ్యయుక్తంబు
భారత హిందూమత; మిద్దిగాంచ, కెవరో "ప్రామాణ్య
మైయొప్పదీ
మత"మంచున్వచియించినంత, బుధసన్మాన్యుండు తద్భావమె
త్తి, తగంజూడక పీడనొక్కా? 62

శా॥ ఏదేశంబున, నేమతం, బెటులఁ దానేఁ పాటినన్, సౌఖ్య
మొం తే దైవాటి, విముక్తికిన్పథము తా దింపొందునో; యట్లుజ్ఞా
నోదారుల్ నియమించి, రార్య్యాలలన్ప్రోచ్చండలన్ మించి కే
నీధీరుల్ గతిమార్పవచ్చు; 63

శా॥ కల్లల్లేక, దయంజెలంగియు, ద్విషత్కాండాతిగర్వంబునుం
జెల్లాసద్గుణపూజ, మెందున రహించెంపాటి, లోక బునం
దెల్లన్ మంచిమతంబటంచు, నెదితా నేపాటునో? యద్దిరం
జెల్లున్ లోకమునందుఁ జాల ; 64

శా॥ "నీరూపప్రభ, నాయువున్, వరమతిన్, నీభక్తసంఘానకున్
జేరంజేయుదు నీ"వటంచు మదినింజింతింతు, హాలాహాలా
హారా! కాలజయా! సమస్తవిదుదారా! ప్రోవుమా! నాకునీ
వేరా ది ; కిఁక నేరు లేరు : 65

మ॥ సుకమేనిన్, మఱిదుఃఖమేనియును హెచ్చించెఁకు
నెవ్వాఁడు, వా
నికి స్వీయాభిమతంబు మిత్రతతికే తెల్పంగడుంగష్టమా;
నీకనే, నెట్లుమహేశ! నీయెదుర నాహృద్వ్యాకులత్వంబు తం
డ్రి ! కటా ! తెల్పుదుఁ ? బ్రోవుమీ వె; 66

మ॥ మిగులుం దేవతలెల్ల భక్తుమతినెమ్మింజూచి, యవ్వానివై
నగుణంబుల్ సరిపోయినన్ వరములన్ దామిత్తు; రీవట్లుగా
క, గురుప్రీతినిమున్నకోర్కులిడి పైగట్టంబురాఁబాఁపికొం;
దిఁకనీకున్ సరిదేవులేరి ? 67

మ॥ "ధనికుండీనుఁడౌ కండుచేరి, యచటన్ ధాన్యమ్ము చుంగోర, శ్రీ
ఘనుఁడాతండొగి గాదె దీయువఱకుం గాలుంగనంబోయె దీ
నుని ప్రాణం" బనురీతిఁ గోర్కులను నెంతో కాలమేఁగన్ గడిం
ది నిడన్ లాభముగల్గునొకో ? 68

మ॥ తెలియంజాలనివాఁడ, నడ్డెను,ననున్ దీనాతిదీనున్, గృపా
విలసద్దీప్తిని సర్వకామితములన్ వేనిచ్చి రక్షింపవే
యొలమిన్నిన్నిటు లిన్నిపద్యములతో నే వేఁడితిం, దేవరా!
యిలనీవేకద! నాకుదిక్కు? 69

మ॥ కడుదీనంబుగ నేమియుం దెలియఁగాఁ గానట్టి నేనీగతిన్
వడి నిన్ వేఁడుచునుండ, సత్కరుణ నీభావంబునన్ రానిచో
బుకమిన్నీవిఁక నేరిఁ బ్రోఁచెదవు; శంభో! దీనరక్షాగురూ!
యిడుమా! మావగుకోర్కెలెల్ల; 70

మ॥ అడుగన్, దక్షిణనిచ్చువాఁడెకద? దాతృగ్రేసరుండుర్విపై
నడుగంగా నడుగంగనిచ్చు నతఁడా యట్లందునే కీర్తి? హా!
తడయంబోకుము! వేగ బ్రోవుమిఁక; వ్యర్థంబైన యీయాలసిం
పెదలోఁ బూనకు; మ్రొక్కువాఁడ; 71

శా॥ నీవే దేవుఁడ, నేనుదాసుఁడనుగా నిన్నింత ప్రార్థింప, నో
దేవా! నావగులోపజాలము లవెన్నైనన్ మనుంగాక, నన్
వేవేఁ బ్రోఁచుట నీకుఁ గృత్యము; కృపాబ్ధీ! దిక్కు నాకిఁక వే
ఱేవ రొప్పరు; పార్వతీశ! 72

శా॥ ఎన్నోరూపములంది, యన్నిఁటనునీ వేపాఱి, సర్వస్థితుల్
పన్నింపందనరాఁజూసి కెదిరొ యొసర్వాగష్టమే ముందు? నో
సన్నిస్త్రంద్రదయావిలాస! కరమున్ సంప్రీతితోఁ బ్రోవుమా
యొన్నంజాల నిఁకేమిచాల, 73

మ॥సుకము న్దుఃఖముసామ్యభావమున నే సుజ్ఞానితాఁగాంచునో
వికలంబౌనొకో వానిమానసము? ఓర్విఁ సౌఖ్యమందుర్ ముదం
బిఁకఁగష్టంబునయందుఁ జింతగనువారే దుఃఖభాగుల్; బుధా
ధికకామ్యంబగు జ్ఞానమిమ్ము! 74

శా॥అంబానాథ! కృపాంబురాశి! దయారాదా? మమ్మురక్షింపవా
పంజెంజాలశ్రమమ్ము నెమ్మదిని, దేవా! రావ! నీవేకదా?
యింబౌ ప్రీతినినన్నుఁ బ్రోఁచుటకు నింకెవ్వారలుః లేరు హా
యిం బెంపొందఁగఁజేయుమోయి 75

శా॥ లోకంబందుఁదగుర్ విశేషముల నాలోచింప వేత్త్వేఁబున
స్తోకంబౌ శ్రమయౌ; ఫలంబుకొఱఁయాచొప్పౌటనత్యంతసు
శ్రీకప్రాభవదాయకత్వదమలాంఘ్రిద్వంద్వముం గొల్చెదన్
హేకంజాతునతాంఘ్రిపద్మ! 76

శా॥ ఎన్నోతల్కితి; నీకునుంగరుణరాదేనిఁ, మతేనేమిసే
తు? నన్నింతగ వేఁడఁ, బ్రోవఁదగు; లేదో? "చాలకాఠిన్యముం
గన్నట్టి"ండనినీకు దూషణముగల్గంబోదె? నామాటకే
తెన్నోయా; నదిలెక్కయొక్క? 77

శా॥నన్నుంజాలఁగఁగష్టపెట్టితి? ప్రమానాథా! దయావార్థి! యా
నన్నుం బెట్టినబాధలిట్టి వనఁగా నాకుందరంబా? శరీ
రాన్నత్యశ్రమలుర్, మనోవికలతల్, హాహాకృతుల్ మించగా
నెన్నో కొల్పితి; వయ్యో! దేవ! 78

మ॥ తొలిసీవల్లమృకండ సూతినిమహాదుఃఖాబ్ధి నెంతేఁద్వరన్
లలిదాఁటంబొనరించి, నారసివినంగా లేద; యిూశన్ వశిన్
గలిగానన్ దయఁజూతువంచు నెదనెంచన్ మించెనే; కానియ
ల్లిలమిన్నీవొనరింపలేదు; 79

మ॥ ఖరపాపాకర శైల ఘోరకులిశా! గౌరీశ ! రాకానిశా
కరరుక్పుంజసితాభ్రదేహా! జలజాక్షబ్రహ్మముఖ్యార్చితా!
కరుణాపూరతరంగమంగళసుదృక్సంతృప్త సర్వాశ్రితా!
స్థిరతత్వా! నిగమాంతవేద్య! 80

శా॥ గంగాపూరఘనోత్తమాంగ! మదనాఖండోరుగర్వక్రియా
భంగా! పర్వతసార్వభౌమతనయా ప్రాంచత్పవిత్రాంగ! వే
దాంగస్తుత్యదయానుషంగ!ప్రిశుభాపాంగా!సితాంగా!మహా
ర్థింగాసిల్లఁగఁ జేయుదేల? 81

నా॥ జే! జే! సారసగర్భవందిత! దయాసింధో! జగద్రక్షకా!
జే! జే! దేవనికాయభీతిహరణా! జే! జే! ధరాధ్రాలయా!
జే! జే! జ్ఞాననిధే! సుధాకరధరా! శ్రీకాంతమిత్రా!హరా!
ఏఁజిక్కుందిశిఁ; బ్రోవవేర! 82

మ॥ జయ! గంగాధర! వైరిమండలహరా!సర్వంసహాభృద్ధరా!
భయసర్వస్వమదాపహారి! ఘనచాపస్ఫూర్జితశ్రీవరా !
జయ!జంభాంతకవందితా!జయ!దనూజాతాధమాక్షేప!యా
దియుగావేద్యనిసర్గభావ! 83

శా॥ "ఓ"యంచున్ననుబిల్వ, "నో"యనుచు మాఱుక్తింబ్రసాదించితం
చో యుద్వేలకృపావిలాసక ! భవత్ప్రోల్లాసలీలల్ బుధుల్
స్వాయద్రీతి వచింత్రు; నాకనుభవప్రాముఖ్యమేఁ పాటిలే
దే; యేయట్లొనరింతు? దేవ! 84

మ॥ పిలువంగాఁ బలికిత్తువంట, శ్రితులన్ వేమాఱు రక్షింతువం
ట, లలిన్నీవలెదైవముంటయరుదంటారయ్యా,యట్లయ్యు,ని
న్నెలమింబల్మఱు వేడియుంగరుణచే నేఁపాటి వేమయ్య, హా
యిలఁగింపం బొనరింపవేమి ? 85

మ॥ తగఁబై యాకృతికెల్ల నెంతయును ముస్తాబై, పరిజాసేవలే
మి? గుణస్తోత్రము లేమి? కైకొనఁగనేమేలౌనె? కారుణ్యభ
వ్యగుణశ్రీహృదయారవిందమున నేఁపాటింగనంగాదె యు
క్తిఁగొప్పాటక లాభమేమి ? 86

శా॥ ఏమో లే! "తమరేమొచాలవినమద్బృందంబమందంబుగా
నామోదంబుగనంగఁ జేతు"రని వేనాలించియున్, శంకరా !
వేమాఱున్ననుగొల్చినాఁడ; నయినన్ బొపాటిరక్షింపవే
మీ? కిముక్తి వరద ! దేవదేవ! 87

శా॥ రమ్మానీకునమస్కరించెదను; వైరమ్మా? కృపాసాంద్రభా
రమ్మా నన్ననుగ్రహించుటకు బేరమ్మా ననుంజేర,దూ
రమ్మా నీకిలనానమస్కృతులుకారమ్మా విరోధత్వమా?
ఋమ్మా నాకనుజ్ఞానశక్తి 88

మ॥ అనఘంబీశతకంబు నుప్పుటురివం శాంభోధిచంద్రుిండున
ఘ్నుఁడౌ వేంకటపున్నయార్యుఁడొగిఁబౌత్రిత్సాహంబు
గొల్పంగఁగం
దనవోల్మందిర దోమ వేంకటకవీంద్రిచ్ఛాతుిఁడెం తేని స
ద్వినయంబొప్ప రచించెఁ బ్రోవు 120

మ॥ వెసఁగర్నాల్పురవైశ్యదోమకులగోవిందాత్మజాగ్రేసరుం
డ; సదుద్యద్విధావధానవిలసన్నైపుణ్యుఁడర్క్, సాహితీ
విశదీకృత్కృతి వేంకయాఖ్యసుకవిన్;విద్వద్విధేయుఁడ,నన్
స్థిరమౌ పేర్మిని బ్రోవు దేవ! 121

శా॥ దోషిన్, బాలబిభీషికావితతికిం దుల్యంబు,ఓ దేవ! మ
ద్భాషారీతులు, నీరహింగన నశక్తత్వాన నిందించుటన్
భూషింపుం జలుపన్ బోసంగుతెసఁగున్, బూర్ణాదృతిన్
మన్మథ! ద్వేషీ! మన్ననచేసి ప్రోవు 122

మ॥ సరసక్రోధనవర్షమందునను జ్యేష్ఠఖ్యాతమాసాసితా
దరషష్ఠిన్ భృగువాసరంబు, గ్రహచంద్రబ్రిహ్మభూసంఖ్యవ
త్సరపుర్ జూన్ పదిరెండుగాఁదగిన ప్రాంచత్పుణ్యామొప్పా
అునాఁ
డరుదై గుంటురిబ్రాడిపేటను ద్వదీయంబౌ ప్రతిష్ఠాపన
స్థిరసత్కార్యమునుప్పుటూరి సుకుల శ్రేష్ఠుండుపున్నాభిధుం
డిరవౌ పేర్మినిజల్పె,దేవ!గురునాథేశా! జగద్వల్లభా!!

కం॥ శ్రీగర్తపురీనిలయా
భోగివలయ! కువలయహితపుష్పా ! విజయా
భోగశ్రీకర ! సదయా
త్మా ! గిరిజాంబాసనాథ ! హర గురునాథా ! 124

## ఫలశ్రుతి.

కం॥ గురునాథేశ్వర శతకము
పరమతిఁ జదివినను, వినిన, వ్రాసిన, వారిన్
గురుతరముద మందించున్
గురునాథేశ్వరుఁడు మిగులఁ గూరిమితోడన్.

## గద్యము.

ఇది శ్రీతుంగభద్రాతీరవిరాజమాన కందనవోల్మందిర శ్రీరామచన్ద్ర
పరమాత్మపాదారవిందమరందపానేందిందిరాయమానమానస
దోమ గోవిందాఖ్యార్య వైశ్యశ్రేష్ఠ జ్యేష్ఠాత్మజాంధ్ర
విద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి, శతావధాని
దోమా వేంకటస్వామిగుప్త ప్రణీత
గురునాథ శతకము

సంపూర్ణము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| విజ్ఞాపనము | 12 | శివాలయు | శివాలయ |
| 4 | 16 | కవితా! రచ | కవితారచ |
| 14 | 18 | ధర్మా | ధర్మ |